# మహానంది క్షేత్రము

గ్రంథకర్త: భూమా రామయ్య, తమ్మడపల్లె.



ఓం

నమఃశివాయ

# మహానంది క్షేత్రము

[నవనందుల చరిత్రియు సంగ్రహముగా పొందుపఱుపబడినది]

గ్రంథకర్త :
భూమా రామయ్య
తమ్మడపల్లె

ప్రకాశకులు :
భూమా రామచంద్రియ్య
శారదానికేతనము
తమ్మడపల్లె * కర్నూలు జిల్లా



రు. 3-50

# విషయసూచిక

# ప్రస్తావన

పాఠక మహాశయులారా!

మహాక్షేత్రముల మహిమ మానవకోటికి విదితమైనదే. కాని యాయా స్థలముల చరిత్ర తెలిసికొనుటమాత్ర మించుక కష్టమనియే జెప్పవచ్చును. నేను చాలాకాలము నుండియు నవనందుల యొక్కయు, నందు ముఖ్యముగా మహానంది యొక్కయు చరిత్రమును వ్రాయ నెంచితిని. కాని నేను క్షేత్రమునకు సమీపవాస్తవ్యుడనయ్యు తగిన యాధారములు సులువుగా లభింపక పోవుటచేత నాస్థలములగుఱించి పలువురు పలురకములుగా దెలుపుటచేత నింతవఱ కాలసించ వలసి వచ్చెను. నా యనుభవమును బట్టి మహానంది క్షేత్రమునకు సంబంధించిన నాకు దెలిసిన రెండు విధములగుచరిత్రల నీ చిన్ని పొత్తమున బొందుపఱచితిని. పాఠకు లీరెండు విషయముల నాలోచించి యేదియో యొక నిర్ణయమునకు వత్తురుగాక.

మఱియు నిందు విషయ మతి స్వల్పముగా నుండుటచే నియ్యది చిన్నదయ్యెను. భగవంతుడగు సర్వేశ్వరుడు వెలసియుండు ప్రదేశముల చరిత్ర పొందుపఱుపబడి యుండుట చేతను పండితులేగాక పామరులు సైతము సులభముగా జదువుకొనునట్లు వ్రాయబడి యుండుటచేతను సర్వ జనాదరణీయమై తగిన ప్రోత్సాహము లభింప గలదని యాశించుచున్నాను.

తమ్మడపల్లె
20-1-1963

ఇట్లు
భూమా రామయ్య

# పన్నెండవ ముద్రణ పీఠిక

1963 వ సంవత్సరమున నీ పుస్తకమును తొలిసారిగా ముద్రింపించితిని. మధ్య మధ్య మూడు పర్యాయములు ముద్రింప బడినది. పన్నెండవ ముద్రణము పాఠకులకు దీని యందలి యాదరాభిమానములను దెలుపుచున్నది. క్షేత్ర దిన దినాభివృద్ధి మార్పులవలన నీ ముద్రణమున మఱల కొంత పీఠిక వ్రాయవలసి వచ్చినది. 1971 వ సంవత్సరము మంచినీటి సరఫరా, వసతి గృహ నిర్మాణము, ప్రయాణ శకటము లాగుటకు ప్రదేశము మొదలగు ననేక సదుపాయము లొనర్చబడినవి. వీని నన్నిటి నాయాచోట్ల బొందుపఱచితిని. అత్యవసరమగుచోట్ల కొలది మార్పుల గావించితిని.

తగిన ప్రోత్సాహమిచ్చి నన్నీ కార్యమున కృతకృత్యు నొనర్చిన పాఠకులెంతయు నభివందనీయులు.

శారదా నికేతనము
తమ్మడపల్లె.

ఇట్లు,
భూమా రామయ్య

# ప్రకాశకుల మనవి

మా తండ్రి గారు రచించిన "మహానంది క్షేత్ర" మను నీ గ్రంథము పాఠకుల ప్రోత్సాహముచే పన్నెండవ ముద్రణ భాగ్యము నందినది. విశ్రాంతి నాకాంక్షించు వారి యాశయము ప్రకార మీ ముద్రణమున నాకు గ్రంథ ప్రచురణతో బాటు నవ నందులను గూర్చినట్టియు మహానంది స్థానిక నిర్మాణములను గూర్చి నట్టియు కొన్ని సవరణలు చేయు నవకాశము లభించినది. నాకిట్టి సదవకాశ మొసంగిన పితృ దేవులకు నా హృదయాంజలులు. తగు ప్రోత్సాహ మొసంగుచున్న పాఠకులకు కృతజ్ఞతలు.

ఇట్లు,

**భూమా రామచంద్రయ్య**

శారదా నికేతనము

తమ్మడపల్లె.

నంద్యాల తాలుకా, కర్నూలు జిల్లా

# మహానంది క్షేత్రము

సర్వేశ్వరుడు సర్వమయుడు. అనగా విశ్వమంతయు నిండి యున్నాడు. పాలు ఆవు శరీరమందలి యన్నిభాగముల నుండి తయారైనను పొదుగునందు నిలువయై యున్నట్లు భగవంతుడును పుణ్యతీర్థములయందు సర్వసామాన్యులను సేవించుటకు నిలయుడై యున్నాడు.

అట్టి పుణ్యతీర్థములు భారతావనియందు లెక్కకు మిక్కుట ములు. దక్షిణ భారతమున కర్నూలు జిల్లాలోని శివ క్షేత్రములలో "శ్రీశైలము, మహానంది" యనునవి రెండును ప్రసిద్ధికెక్కినవి.

## 1

## మహానంది క్షేత్రము

దేవతలవలన ప్రాముఖ్యము వహించిన ప్రదేశము క్షేత్రము. నీటివలన ప్రాముఖ్యము వహించిన ప్రదేశము తీర్థము. సామాన్య ముగా క్షేత్రతీర్థముల రెండింటిచే ప్రాధాన్యములైనవి చాల అరుదుగా నుండును. అట్టి ప్రసిద్ధ ప్రదేశములలో మహానంది ఒకటి.

ఇది శ్రీ శైలముయొక్క దక్షిణ ద్వారములోని క్షేత్రములలో నొకటిగా దెలియవచ్చుచున్నది. ఇది నంద్యాల తాలూకా తమ్మడపల్లె (తంబల్లపల్లె) యను గ్రామమునకు 5 మైళ్ళ

దూరమునను, తిమ్మాపురమను గ్రామమునకు 3 మైళ్ళ దూరమునను, గాజులపల్లె రైల్వేస్టేషనుకు 4 మైళ్ళ దూరమునను గలదు. గాజులపల్లె రైల్వేస్టేషను గుంటూరు-గుంతకల్లు మీటరుగేజి రైల్వే మార్గములో నంద్యాల పట్టణమునకు సమీపమున నున్నది. స్టేషను నుండి మహానందికి బస్సు సౌకర్యము కలదు. ఈ క్షేత్రమును గుఱించి రెండురకములైన గాథలు వినవచ్చును

(1) పూర్వమొకి ఋషి యుండెను అతడు నల్లమలకొండ లలో నొకచోట చిన్న యాశ్రమము నొకదానిని నిర్మించికొని సకుటుంబుడై జీవించుచుండెను అతడు శిలాభక్షకుడై సదా తపో ధ్యానాసక్తుడయ్యెను అందువలననే గాబోలాయనను "శిలాదు" డందురు. అత డనపత్యుడగుటచే నతని భార్య యెట్లులైనసంతాన మును ప్రసాదించుడని యతనిని ప్రార్థించెను. అతడు తన భార్య కోర్కె నెరవేర్చ నెంచి సర్వేశ్వరుని గూర్చి మిగుల నిష్ఠతో తపస్సు చేసెను. శంకరుడతని సమీపమున నొక పుట్టగానై వృద్ధి జెందు చుండెను. శిలాదు డందులకు మిగుల సంతోషించెను

కొన్ని దినములకు శిలాదునకు శివుడు ప్రత్యక్షమై కావలసివ వరమును గోరుకొమ్మనెను. శిలాదుడు తన భార్య కోరిక మఱచిన వాడై తన మనోభీష్టమును మాత్ర మెఱిగింప నెంచి "స్వామీ నాకు నీ నిరంతరసేవ యొనర్చు భాగ్యమును ప్రసాదించు" మని ప్రార్థించెను. కానీ సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడతడడుగనున్న విషయమును సమయ మునకు మఱచెనని యెంచి దానినికూడ నెరవేర్చదలచి 'నాయనా! మీ యుభయు (దంపతు) ల వాంఛ సిద్ధించుగాక!' యని యాశీర్వ దించి, యదృశ్యుడయ్యెను.

వెంటనే యా పుట్టనుండి యొక బాలుడుద్భవించెను. శిలాదుడు తన భార్యను బిలిచి, యా బాలు నామె కిచ్చెను. ఋషి దంపతులిరువురు మహానందమున నోలలాడిరి మహానందమును గూర్చుటచే నా బాలునకు "మహానందు" డని నామకరణం బొనర్చిరి. బాలుడు క్రమక్రమముగా వృద్ధియయ్యెను. ఉపనయనానంతరము మహానందుడు గురువుల కడజేరి విద్యలన్నియు నేర్చెను. తల్లి తండ్రుల మెప్పు సంపాదించెను.

ఒకనాడా బాలుడు తల్లితండ్రులకు చేతులు జోడ్చినమస్క రించి, "శివునిగూర్చి తపముచేయువాంఛ నాకుగలదు. కరుణించి వెంటనే సెలవిండు" అని ప్రార్థించెను. నిరంతర తపోనిమగ్నులగు నా ఋషిదంతతులు కుమారుని మనస్సు నందున్న కోరికకు మిగుల సంతోషించిరి. 'శ్రద్ధగా శివునిధ్యానించు' మని సెల వొసంగిరి.

మహానందుడు కొలది దినములు మాత్రమే శివుని గూర్చి ఘోర తపస్సు చేసెను. శంకరుడు సపరివార సమేతుడై ప్రత్యక్ష మయ్యెను. అంత నా బాలు డానందభరితుడై చేతులు జోడ్చి

## దండకము

శ్రీ శంకరా! దివ్య తేజో విలాసా! హరా! యుగ్రహాలా హాలాభక్ష! యోంకార భృంగీశ! నందీశ! సేవ్యర్చితా! నేకలోకాధినేతా! గిరీరాజ పుత్రీశ! మేరుర్ధరా! బాల చంద్రాధరా! దివ్యగంగాధరా! దేవతానీక సంఘంబులు నిన్ను నిత్యంబు సేవింప సంపద్విలాసంబులం గూర్చియున్ సంపదల్ జేసి బ్రోవంగ లేదే చిరంజీవి

మార్కండుడవ్వేళ జావంగగా లేక వేడంగ మృత్యుం
జయుండందు గాన్పించి యాకాలు డాకాల బోదన్ని
మార్కండు రక్షించి యా సూర్యచంద్రాదులున్నంత
కాలంబు యాయుస్సునున్నిచ్చి బ్రోవంగ లేదే యనే
కాది సత్యజ్ఞనానీక ముంబ్రోచితీగాదే లోకేశ! యీశా
యనేకాది దివ్యస్థలంబుల్నె లార్చంగలేదే యహం
కారు దక్షుస్కృతింజేస్సితీగాదే ముక్కంటి! కారుణ్యరాసీ
మునీంద్రాది స్తోత్రాఖ్యనం బ్రోవగా వచ్చితీశా నమస్తే
నమస్తే నమః”

అని స్తుతించెను.

సర్వేశ్వరుడు సంతసించి ‘బాలకా! ఏమి వరమడుగ నుంటివో కోరుకొ’మ్మనెను. ఆ బాలుడు ‘స్వామీ! నేను నీ వాహన మగునట్లు వరము ప్రసాదింపు” మని ప్రార్థించెను. శివుడందుల కనుగ్రహించి, యటనున్న పుట్టను జూపి ‘కుమారా! పూర్వము నేనీ పుట్టలో బుట్టితిని ఇటనున్న కొలను అహర్నిశము ప్రవహించు గంగా నది యగును ఎట్టి పరిస్థితుల యందైనను నీరు సమముగా ప్రవహించుచు సదా పవిత్ర వాహిని యగును. ఈ పవిత్ర ప్రదేశము ఏబది మైళ్ళు నీ పేరిట “నంది మండలము” అని ప్రఖ్యాతి జెంది పరమ పవిత్ర క్షేత్రమగును. నేను ఏబది మైళ్ళలోపల నవ క్షేత్రముల లింగరూపుడనై యుందును. ఇది నిశ్చయము అని చెప్పి యతనని తన వాహనముగా జేసికొని కైలాసమున కేగెను.

అప్రదేశమే మనమిపుడు గాంచుచున్న "మహానంది” యనెడి క్షేత్రము.

## 2
## నందన మహారాజు చరిత్రము

పూర్వము నంద్యాల పట్టణమును " నందుడు " అను రాజు పరిపాలించు చుండెను. ఆ సమయమున "గోపితవరము" (ఇప్పటి గోపవరము) అను నొక గ్రామమున నొక గొల్లనికి పెద్ద ఆవుల మంద యుండెను. ఆ యావులు ప్రతి దిన మడవికి బోయి, కడుపార మేసి యింటికి వచ్చుచుండెను. అందలి యొక యావు అరణ్యమందలి యొక పొదలో ప్రవేశించి యటనున్న పచ్చ గడ్డిపై పాలుగార్చి, యధావిధిగా మందలో గలిసి ఒట్టి పొదుగుతో నింటికి వచ్చుచుండెను. కొన్ని దినములు గడచు సరికి పశువుల కాపరుల కాయావు పాలు బిదుకనీయకుండుటకు గల గారణమును తెలుసుకొను తలంపు బుట్టెను.

ఒకనాడు వారాయావును ప్రత్యేకముగా గనుగొనుచు నాలమంద వెంటబోయిరి. అరణ్య మధ్యమును జేరుసరికి కా యావు తన మామూలు ప్రకారము పొదలోనికి ప్రవేశించెను. కాపరులు పొద చాటున నక్కియుండిరి. ఆవు పచ్చని గడ్డిపై నిలుచుండెను. ఒక పుట్ట యాపచ్చని గడ్డిచే నావరింపబడి యుండెను. ఆ పుట్టనుండి యొక పసి బాలుడు బయల్వెడలి గడ్డియందుండి పాలు ద్రావెను. ఆవు తిరిగి వచ్చి మందలో జేరెను.

ఆలకాపరు లింటికి వచ్చి యా విషయము నచ్చటచ్చట మాటలాడుచుండిరి. గూఢాచారులది విని నందన మహారాజునకు తెలియజేసిరి. జు పరమానంద భరితుడై స్వయముగా నా సంఘటనను జూడ నిశ్చయించెను. మరునాడే యశ్వారూఢుడై యొకే యొక

రక్షక భటునితో నచటికేగెను. ఆలమంద యడవికి రాగా నేమాటువ మంద వెంట నేగుచుండెను. ఆయావు మామూలుగా బోయి పొదలో దూరెను. రాజొక్కడే బోయి యా పొదలమాటునుండి గోవు చర్యలను గమనించుచుండెను. ధేనువు పుట్టకడకు బోయి పాలు స్రవించెను. రాజా దృశ్యము నింకను బాగుగా జూడ నుత్సహించి నిశ్శబ్దముగా ముందుకడుగువేయుచుండెను. వెనుకటి శబ్దమును విని, ఆవు మిగుల భయమంది పరుగెత్తెను.

ఆవు తడబడుచు పరుగెత్తునపుడు దాని కాలు గిట్ట యా పుట్టపై దిగబడెను. బాలునితోగూడ నా యావు మాయమయ్యెను. రాజాశ్చర్య చకితుడై దిక్కు తోచక వెనుకకు మరలి వచ్చి తన రక్షక భటునితో గూడ నిజ పురికేగెను. అతనికి రాత్రి సరిగా నిద్ర పట్టలేదు. మూడవ ఝామున నతడొక కల గనెను. ఆ కలయందతనికి పరమ శివుడు సాక్షాత్కరించి, "నీవు గాంచిన పుట్టయందుండి పాలు ద్రావినది నేను గాని యన్యుడుగాదు. కాన నీవా పుట్టను పూజించుచు నటనొక దేవాలయమును గట్టించుము. నేనచ్చటనే గాక యా చుట్టును గల యేబది మైళ్ళ దూరము లోపుగా నవనందులను పేర ప్రసిద్ధిగాంచగల క్షేత్రములందు లింగరూపుడనై వెలసియుందును. గంగాదేవియు నిచటనే వెలసి నిత్యము నన్ను సేవించుచుండును. గంగాదేవియు నిచట వెలయుటచే నీ స్థలము అన్ని వేళలందు నిత్య కళ్యాణము పచ్చతోరణమై వృద్ధిజెందును. నీ కీర్తి శాశ్వితమగును" అని చెప్పెను.

రాజా మరునాడే యా పుట్టకడ కేగెను. అతడు జూచు సరికి పుట్ట శివలింగముగా మారియుండెను. నందు డాశ్చర్యచకితుడై లింగము వంక తదేక దృష్టితో జూచుచుండెను. లింగము నందు ఆవుగిట్ట దిగబడి యుండిన గుర్తు స్పష్టముగా కనబడెను. నందుడు సంశయ నివృత్తుడయ్యెను.

శివునాజ్ఞ ప్రకార మతడచ్చట నొక దేవాలయమును నిర్మించెను ఆ దేవాలయమున కెదురుగా నొక చిన్న కొలనును త్రవ్వించబోయెను. కొలది సేపటికది యనంత గంగా వాహినిగా మారెను. అతడా కొలనునకు "రుద్రగుండము" అని పేరిడెను. అచ్చటి పనివాండ్రాయనచే నా దేవాలయమున కుత్తర దక్షిణము లందును నీరు పడునని తెలిపిరి. రాజందులకు సంతసించి, ఉత్తర, దక్షిణ దిక్కులందును త్రవ్వించెను. కూలీలన్నట్లు నీరుండెను. ఆ రాజు మూడు గుండములు త్రిమూర్తుల పేర ఖ్యాతి నొందవలెనని తలంచెను. అందుచే నొక గుండమునకు "బ్రహ్మగుండ" మనియు నింకొక గుండమునకు "విష్ణుగుండ" మనియు పేర్లిడెను. ఇవన్నియు నొక ధినములోనే జరిగెను. శివుడు నవ క్షేత్రములలో వెలయునని చెప్పుటచేతను, అందది మొదటి క్షేత్రమగుట చేతను రాజు దానిని గొప్పగా నెంచెను. అందుచే నా క్షేత్రమునకు "మహానంది" అని పేరిడెను.



## మహానంది యందలి శివలింగము

## స్వయంభూ లింగము

సామాన్యముగా పానపట్టమునందు లింగము నమర్తురు. కాని యిచ్చటి లింగమును పరికించినచో నట్లుగాక పానపట్టమే లింగమున కమర్చబడినది. ఆవు గిట్టయొక్క గుర్తు స్పష్టముగా గనబడును. అందువలన నీ స్థలపురాణ మెంత మాత్రి మతిశయోక్తి గాదనియు కేవలము సత్యమేననియు స్పష్టమగును.

## కామేశ్వరీ దేవాలయము

ఇచ్చట పార్వతీదేవి కామేశ్వరీ దేవియను పేర వెలసినది. కామేశ్వరీదేవాలయము ఈశ్వని దేవాలయమునకు దక్షిణ భాగమున నిర్మింపబడినది. ఆ దేవాలయ నిర్మాణము నందనేక భక్తులుసాయపడిరి. అందు భైరవ జోశ్యుల రామచంద్రియ్యగారు, భైరవజోశ్యుల మ హ న ం ద య్యగారును ముఖ్యులు

అచటనే కుమారస్వామియు, విఘ్నేశ్వరుడును వెలసియున్నారు.

## లోపలి కోనేరు

తరువాత కొందరు మహనీయులు రుద్రగుండము బాగుచేయించి చుట్టును కట్టడమును నిర్మించిరి. ఆ కొలనుకు నలు వైపులను దిగుటకు మెట్లుగలవు మధ్య భాగమున దేవాలయమున్నది అందును పంచ

దేవాలయ మున్నది. అందును పంచలింగములను ప్రతిష్ట చేసిరి. కొలను తూర్పుదిశ యందలి ప్రతి భాగము నుండియు నీరు వచ్చుచున్నట్లు గనపడును. కాని యీదిశ యందలి మధ్య భాగమున నున్న నంది నోటినుండి యెక్కువగా వచ్చుచున్నట్లు దోచును. అందలి గోడలపై నటరాజ, సూర్యుడు, వరాహావతారము మొదలగు చిత్రములు మిక్కిలి యద్భుతముగా జెక్కబడినవి. అచటి నీరు రెండు తూములద్వారా బయటనున్న కోనేరులలోనికి ప్రవహించి, క్రమముగా నచటనుండి ప్రవహించి దాదాపు రెండు వేల యెకరముల భూమిని బంగారు పండునట్లు చేయుచున్నది.

## 5
## మహనంది క్షేత్రమునకును మానవ దేహమునకును గల పోలికలు

ఆధ్యాత్మవిదులు మహానంది క్షేత్రమును మానవ దేహముగా బోల్చి యిట్లు చెప్పుదురు.

మానవ శరీరమే మహానంది క్షేత్రము. శరీరము నందలి యిరువదియైదు తత్వములే చుట్టునుగల ప్రాకారములు. నాలుగు అంతరేంద్రియములే చతుష్టయ గోపురములు మూలమగు సుషుమ్న నాడియే లోపలి కోనేరు. ఇడా, పింగళ యను రెండు నాడులే బయటనున్న రెండు కోనేరులు రథము చుట్టు దిరుగునపుడుగల యిరువది యొక్కవేల యారువలదల మంది ధ్వనులే ప్రతినిత్యము నిరువది యొక్కవేల యారువందల పర్యాయములు జరుగు హంస

జపములు. ఈ తీర్థము (సుషుమ్న నాళము) నందు స్నాన మాచరించి, మిగుల నిష్ఠచే దృష్టిసారించి కనుగొన్నచో దెలియు ఆత్మ జ్యోతియే శివలింగము.

6

## మహానంది క్షేత్ర అభివృద్ధి

మహానంది క్షేత్రమునకు నంద్యాల పట్టణ వాసియు సద్బ్రాహ్మణుడు శ్రీ భైరవజోశ్యుల మహానందయ్యగారు దాదాపు 45 సంవత్సరములు ధర్మకర్త గా నుండి చాల యభివృద్ధి - దశకు దెచ్చిరి. వీరి సౌదరులగు రామచంద్రయ్యగారును ధర్మకర్తగానుండి కొంత కాలము వీరికి సాయపడిరి. మహానందయ్యగారు అచటి గాలి గోపురములు చుట్టునుగల మంటపములు కామేశ్వరీ దేవ్యాలయ నిర్మాణము రెండు కోనేరులు ఉత్సవమున కవసరమగు రథము, అన్ని ప్రదేశములందున్న రోడ్డు, ఎద్దులు లాగుటకు రాతి దూలము మొదలగు వానిని జేసిరి. చుట్టును గల ప్రదేశమున యాత్రికులకు వలయు సదుపాయములు కలుగజేసిరి. మహనంది చుట్టునుగల దాదాపు నలుబది ఎకరముల భూమిని స్వామి పేరిట జేసిరి. అందు అరటి, వరి మొదలగు పంటలు పండును. ఈ పొలమునకు భూమి పన్ను మాత్రమే చెల్లించుటకును, నీటి పన్నును రద్దుచేయుటకును, ఆనాటి కలెక్టరుగారినుండి ఉత్తర్వులు పొందిరి. తమ్మడపల్లె (తంబళ్లపల్లె)లో దాదాపు 5 ఎకరముల మాగాణి భూమిని 65 ఎకరముల మెట్టభూమిని ప్రోగుజేసిరి.

పడమటి భాగమున నొక గొప్ప టెంకాయ తోట నిర్మించబడెను, దేవాలయ స్థల సరిహద్దులలో నేమాత్రము వేటాడకుండుటకును, ఆవరణములో నెచ్చటను చేపలు పట్టకుండుటకును ఉత్తర్వులు పొంద బడెను.

ఈ క్షేత్రమును కార్యనిర్వాహకోద్యోగియగు శ్రీ పి. సిద్దారెడ్డి గారు యాత్రికులకు ఆకర్షణీయమగునట్లు జేయుటయేగాక యనేక వసతి గృహములు, శిథిల ప్రదేశ పునర్నిర్మాణము, విద్యుచ్ఛక్తి సరఫరా, యాత్రీకులు సులభముగా ప్రయాణము జేయుటకు బస్సు సౌకర్యములు మొదలగునవి యెన్నియో జేసిరి. ప్రభుత్వ శాఖోద్యోగులు దిగుటకు వసతి గృహములు నేర్పాటు గావించిరి. తపాలా సౌకర్య ముల జేసిరి.

ఇచట టెలిఫోను సౌకర్యముగూడ గలదు. 1971 వ సంవత్స రము శివరాత్రి (సాధారణ నామ సంవత్సర మాఘ బ॥ ౧౪ లు సరియగు 23-2-71) నాటికి వసతి గృహముల లోనికిని, అనేక మార్గకేంద్రములకును నీటి సరఫరా జరిగినది.

దీనివలన నన్నివేళల పరిశుభ్రమగు నీరు లభ్యమగుచున్నది. యాత్రికుల కెంతయో యుపయోగముగా నున్నది.

ఇటీవల తిరుపతి దేవస్థానమువారు రెండంతస్తుల వసతి గృహ ముల పెక్కింటి నేర్పాటు గావించిరి. ఇవి మంచి సౌకర్యములు గలిగి యాకర్షణీయముగా నున్నవి. త్వరలో వీటిని బాడుగ కిచ్చుటకు వలయు నేర్పాట్లు జరుగుచున్నవి.

## ప్రాథమిక పాఠశాల

ఇచ్చట నంద్యాల పంచాయతీ సమితి వారొక ప్రాథమిక పాఠశాలను నిర్మించిరి. ఒక ఉపాధ్యాయుడు పనిచేయుచున్నాడు.

ఐదవ తరగతి వరకు తెలుగు మాతృభాషలో విద్యాబోధన జరుగుచున్నది.

ఇటనున్న చెంచుల ఉద్యోగుల, వ్యాపారస్తుల పిల్లల విద్యాభివృద్ధి కిది దోహదకారిగా నున్నది,

## 7
## అయ్యన్నరుగు

మహానందికి పడమరగా సుమారొక మైలు దూరమున "అయ్యన్నరుగు" అను ప్రదేశము గలదు. అచట రెండు చప్పరము (అరుగు)లును, వానిపై నీడ నొసగు చెట్లు సమీపమున బావియు, చీని తోటయు స్వామివారి పూజారులకు వలయు పూగీ ఫలాదుల తోటయు గలవు. ఈమధ్య చీని తోట యరటి తోటగా మారినది.

## 8
## గోరక్షణశాల

ఇంకను రెండు మైళ్ళ దూరమున నొక గోరక్షణశాల యుండెను ఈ ప్రదేశము మొదట బ్రాహ్మణుల కివ్వబడిన యొక యగ్రహారము బావియు చిన్న కోనేరును శివాలయమును గలిగి "అల్లి నగరము" అను పేరుతో నుండినది. నల్లమల కొండలలో 250 ఆవుల వరకు పుల్లరి లేకుండా మేయుటకు జిల్లా ఫారెస్టు ఆఫీసరుగారి నుండి ఉత్తర్వులుండినవని చెప్పుదురు. అచ్చటను నిత్య పూజలు జరుగుచుండెను. ప్రస్తుత మీగోరక్షణశాల మహానందియందే నిర్మింపబడినది

నందన మహారాజు శివార్చనకై తంబళ్ళవారిని కొందరికి రావించి వారి కొకయూరు దానమిచ్చి శివార్చనకు నియమించెను. తంబళ్లవారి కివ్వబడిన దగుటచే దానిని "తంబ

పల్లె" (తమ్మడపల్లె) యందురు. ఆయూర నొక శివాలయమును గట్టించెను, కాని స్వామివారికి ప్రతినిత్యము అభిషేకము జరుగునట్లు కనబడదు. స్వామి కోపించి తంబళ్లపల్లెయందు తంబళ్ళ వారిని లేకుండజేసెనో తంబళ్లపల్లెయందు తంబళ్ళవారు లేకపోవుటచే స్వామి వారికి నిత్యాభిషేకములు జరుగుటలేదో తెలిసికొనుట కష్టము.

మహానంది క్షేత్రమునందు నిత్యము స్వామివారికి మంగళ వాయిద్యములతో నభిషేకాదులు జరుగును. అర్చన, మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము, బిల్వార్చన మున్నగు నన్నివిధముల పూజాదు లొనర్చుటకు కావలసిన ఏర్పాట్లు కలవు. అమ్మవారికి కుంకుమార్చన మున్నగు పూజాదు లొనర్చుటకు వలయు నేర్పాట్లు కలవు. ప్రయాణీకుల కనేక వసతులు గల్పింపబడినవి. నిత్యావసర వస్తువులు లభించు దుకాణములు ఫలహార భోజన వసతులు గలవు. ఇందలి జల ప్రవాహ మత్యద్భుతమైనది. ఇంతటి స్వచ్ఛమైన పుష్కలమైన నీటిని గలిగి, యంతటి సౌకర్యమును గలిగి, నిర్మలమైయున్న పుణ్య క్షేత్రము దక్షిణ భారతమున నింకొకటి లేదని చెప్పవచ్చును.

## 9
## శివరాత్రి - ఉత్సవములు

సురాసుర యుద్ధమున దేవతలు రాక్షసులచే బాధింపబడుచు ప్రాణభీతి నొందుచుండిరి. అపుడింద్రుడు, వరుణుడు మొదలగు కొందరు సురముఖ్యులు బ్రహ్మదేవునికడ కేగి వారికి గలిగిన దుస్థితిని తెలిపిరి. బ్రహ్మ వారిని విష్ణుసదనమునకు దోడ్కొనిపోయి విష్ణువు నుద్దేశించి దైవిక వచనములతో స్తుతియించెను. దయామయుడగు

పురుషోత్తముడు ప్రత్యక్షమై వారి ప్రార్థనమును విని "యమృత మునకై మందర పర్వతమును మంథానము (కవ్వము) గను వాసుకిని కవ్వపు త్రాడుగను జేసి పాల సముద్రమును మథింపుడు. మీకు నేను సహాయపడెదను. పాపమతులకు దుఃఖమును, ఫలము మీకును గలుగును, అఖిలార్థములును గలుగును. కాని నీటిలో విషము బుట్టును. భయమందవలదు" అని యాదేశించి మాయమయ్యెను. బ్రహ్మయు, ఫాలాక్షుడును తమ తమ నెలవుల కేగిరి.

ఇంద్రాది దేవతలు బలి మొదలైన రాక్షసులచే చెలిమిచేసిరి. సురాసురులు (దేవతలు, రాక్షసులు) మందర పర్వతమును దెచ్చి సముద్రములో మోసబోగా నదిచరిపై బడెను. వారు పరమేశ్వరుడు తమ్ము రక్షింప మఱచెనా యనుకొనుచుండగా హరి ప్రత్యక్షమై యాపర్వతమును బంతివలె చేతబట్టి యాడుచు వారిని రక్షించెను. భూధరముతో సంద్రముకడ కరుగుమని గరుడు నాదేశించెను. గరుత్మంతుడు మందర పర్వతమును విష్ణుమూర్తిని మోసికొనిపోయి సముద్రటొడ్డున డించి, తన నివాసమున కేగెను. దేవదానవులు వాసుకిని కవ్వపు త్రాడుగా నుండుట కొప్పించిరి. మందరమును కవ్వముగా నెంచి సముద్రమును మథించుటకు సంసిద్ధులైరి. హరియు దేవతలు వాసుకి తలలు బట్టబోయిరి. విష్ణు మాయచే రాక్షసులు తోక బట్టుకొనుట తుచ్ఛమనిరి. అంత దేవతలు తోకను, రాక్షసులు పడగలనుబట్టి మందరం పర్వతమును సముద్రము నందుంచి చిలుకుచుండిరి. మందరము సముద్రమున మునుగుచుండెను. వారు సముద్రతీరమున దుఃఖించుచుండిరి. విష్ణుమూర్తి మహాకూర్మమై (పెద్ద

బొబేలై) సముద్రమున జొచ్చి మందరమును పైకెత్తి మోయుచుం డెను. వారు మణుల ద్రచ్చుచుండిరి.

మంటలచే బొబ్బలిడుచు హాలాహల విషము పుట్టెను. అది మహా విషము. మిక్కిలి ప్రకాశించుచు మహాధ్వని చేయుచు, లోకముల గాల్చివేయ నుంకించుచు సర్వసంహార మొనరించుచుండెను. దాని నెదుర్కొనువారు లేకపోయిరి. బ్రహ్మాది దేవతలు మహాదేవునికడ కేగి "దీనరక్షకా! పాలసముద్రమును మధించుచుండగా హాలాహల ముద్భవించి లోకములను కోలాహల మొనర్చుచున్నది. దాని నణచి ప్రాణిజాలమును బ్రోవు" మనిరి. శివుడా విషయమును సతీదేవితో దెలుపుచు "దేవీ! హాలాహలమును సూక్ష్మరసమువలె భక్షించి, ప్రాణి కోటిని రక్షింతును చూడు"మనెను. సర్వమంగళ 'నీయిష్ట' మనెను. మహదేవుడా మహావిషమును తన చేతియందిమిడ్చి ముద్దగా జేసి నేరెడు పండునువలె భక్షించి కంఠమున నిలిపికొని 'నీలకంఠు'డయ్యెను.

(సురాసురులు మరల రత్నాకరమును ద్రుచ్చుచుండిరి. క్రమ ముగా కామధేనువు, ఉచ్చైశ్రవము. ఐరావతము, కల్పవృక్షము, అప్సర బృందము, చంద్రుడు, లక్ష్మి, వారుణి, యనుకన్య, చేతియం దమృత కలశముతో ధన్వంతరి యుదయించిరి.)

ఆనాడు శివుడు నిద్రింపలేదు. తెల్లవారువరకు వేడి తగ్గుటకై భక్తులు గోక్షీరాదులతో నభిషేకించుచుండిరి. అట్లు పరమేశ్వరుడు లోకోపకారార్థమై గరళమును మ్రింగి జాగరణ మొనర్చిన దినమే మహాశివరాత్రి అందుచే మహాశివరాత్రినాడు భక్తులెల్లరును ఉపవాస

ములతో జాగరణ జేయుదురు. గరళమును మ్రింగుటచే నాయనకు "గరళకంఠు"డనియు "నీలకంఠుడనియు" బేర్లుగలవు.

రెండవ దినము మయూర వాహనముపై పార్వతీ పరమేశ్వరుల నూరేగింతురు.

మూడవ దినమున రథోత్సవము జరుగును. ఈ యుత్సవము నాటి కాబాలగోపాలము మహనంది క్షేత్రమునకు వత్తురు. లక్షలాది జన మచ్చట జేరును. మహవైభవముతో రథోత్సవము జరుగును.

గొప్ప యెద్దులచే రాతి దూలమును లాగింతురు. బరువు లెత్తుట వినోద కార్యక్రమములు మొదలగువాని నేర్పాటుచేసి గెలుపొందిన వారికి దగిన బహుమతులనిచ్చి ప్రోత్సహింతురు, దేవస్థానమువారే గాక నంద్యాల పంచాయతీ సమితివారు గూడ నీవిషయమునందు వలయు ప్రోత్సాహ మొసంగుచున్నారు.

శివరాత్రి దినములందన్ని వర్ణములవారికిని అన్నసత్రము నేర్పాటు చేయబడినవి. బ్రాహ్మణులకు నిత్యాన్న సౌకర్యములకు వలయు నేర్పాటు గావించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. కాని కార్యరూపములోనికి రాలేదు.

నంద్యాల ఆర్యవైశ్య సంఘంవారు వైశ్యల అన్నసత్రము నేర్పాటు గావించిరి. నిత్య భోజన సౌకర్యములకు గావలసిన యత్నములు గట్టిగా జరుగుచున్నవి భగవంతుడు భక్తాదుల బురిగొల్పి త్వరలో బ్రాహ్మణ వైశ్యులకేగాక యన్ని జాతులవారికిని నిరతాన్న సౌకర్యములు జరుగు నేర్పాట్లొనర్చుగాత.



శ్రీ కోదండ రామస్వాములవారు

10

## కోదండ రామస్వామి దేవాలయము

శ్రీ భైరవజోష్యుల మహానందయ్యగారు మరణానంతరము వారి సతీమణి శేషమ్మగారు మహానంది క్షేత్రమునకు కేవలము శైవులు మాత్రమే యెక్కువగా వచ్చుచున్నారనియు నది వైష్ణవులకును పుణ్యభూమి గావలెననియు నెంచి శివాలయమున కీశాన్య భాగమున శ్రీ కోదండరామస్వామి దేవాలయమును నిర్మించిరి. విగ్రహములు స్ఫటిక రాళ్ళతో నిర్మించఁబడుట చేతను, భక్తులగు శిల్పులచే నిర్మింపఁబడియుండుటచేత నచటి హనుమత్సమేత సీతారామ లక్ష్మణ విగ్రహములందు జీవకళ యుట్టిపడుచున్నది. శేషమ్మగారు తన సర్వస్వమును సమర్పించి, దేవాలయమును వృద్ధిచేయుచు, నిత్యపూజాదులు జరుగు నేర్పాట్లు గావించియున్నారు. తన జీవితానంతరము తనకు సంబంధించిన దాదాపు ముప్పది వేల రూపాయలు విలువగల యాస్తి నంతయు దేవాలయమునకు జెందు నేర్పాట్లు జేసియున్నారు.

ఈ దేవాలయమునకు శ్రీ శరణప్పగారు పూజారిగా నియమింపబడి, నిత్యపూజాదులు జరుపుటయేగాక భక్తాదులను ప్రోత్సహించి, వారి సహాయమున దేవాలయము నెంతయో యభివృద్ధిదశకు దెచ్చిరి. విగ్రహముల కద్భుతమగు నలంకారముల గావించిరి.

## 11
## శ్రీరామనవమి యుత్సవము

శ్రీరామనవమి దినమున శ్రీ కోదండరాములవారికి గొప్ప యుత్సవములు జరుగును హనుమద్వాహనము తయారు చేయబడి నది. శివరాత్రినాటి శివునకువలెనే శ్రీరాములకును శ్రీరామనవమినాడు ఉత్సవములు జరుగును. యాత్రికుల కుచిత భోజన వసతులుండును.

గుర్రపు పందెము, సైకిలు పందెము, బరువు నెత్తుట మొదలగు పందెములు జరుగును. గెలుపొందినవారికి బహుమతులు పంచిపెట్ట బడును. భకాదులు హరికథ వినోద కార్యక్రమములతో నారాత్రి గడిపెదరు.

## 12
## నవనందుల చరిత్ర

శివుడు వర మొసగినట్లు

"నవనందు"లను తొమ్మిది ప్రదేశములందు వెలసెను.

అవి —
(1) ప్రథమనంది
(2) నాగనంది
(3) వినాయకనంది
(4) గరుడనంది
(5) శివనంది [లేక] రుద్రనంది
(6) మహానంది
(7) సూర్యనంది
(8) విష్ణునంది [లేక] కృష్ణనంది
(9) సోమనంది

1



# ప్రథమనంది

ఇది నంద్యాలకు నైఋతి భాగమున, చేమకాలువ యొడ్డున గలదు. ఇచ్చట పూర్వము విధాత పరమశివునిగూర్చి తప మాచరించెను. బ్రహ్మదేవుడు కోరినట్లిచట పరమేశ్వరుడు ప్రథమనందీశ్వరుడై యున్నాడు. ఈ క్షేత్రాభివృద్ధికై భక్తులు ప్రోత్సహించుచున్నారు. శివరాత్రినాడు ఉత్సవములు జరుగును.

ఇచ్చట కార్తీక శివరాత్రియందును ఉత్సవములు వైభవముగా జరుగును. నంద్యాల పట్టణమునకును, రైల్వే స్టేషనునకును చాల దగ్గరగా నుండుటచే యాత్రికు లెక్కువగా వచ్చుచు, పోవుచుందురు వివాహములు జరుపుకొనుటకు యాత్రికు లుండుటకును మంచి వసతులు కలవు. అందువలన వివాహ మహోత్సవములుకూడ జరుగుచుండును. ఇది కాలువ యొడ్డున నుండుటచే నీ క్షేత్ర దృశ్యము చూచుటకు రమణీయముగా నుండును,

2

## నాగనంది

ఇది నంద్యాల పట్టణమందలి ఆంజనేయస్వామి దేవాలయములో నున్నది. పూర్వము నాగులు గరుత్మంతుని ధాటి కోర్వజాలక తిరిగి తిరిగి వచ్చి నందివాహనుని గూర్చి తపమాచరించిన ప్రదేశమగుటచే దీనికి "నాగనంది" యని పేరువచ్చినది. నాగుల తపమునకు మెచ్చిన నందివాహనుడు వారి కభయమొసంగి కాపాడెను, దసరా



నవరాత్రిలందును శ్రీరామనవమి నవరాత్రిలందును ఉత్సవములు జరుగును. అనేకులా ఉత్సవములందు పాల్గొందురు. మంచి వసతు లుండుటచే వేసవి కాలములో వివాహ మహోత్సవములును జరుగును.

4



## వి నా య క న ం ది

ఇది మహానందికి

ఆగ్నేయ భాగమున చాలా దగ్గరలో నున్నది. కోనేటి గట్టున గలదు. ఈ దేవాలయము సమీపమునందచ్చటచ్చట లభించిన శిధిల రాతి విగ్రిహముల నొకచోట జేర్చి యున్నారు.

ఇచట పూర్వము వి నా య కు డు విజయయాత్ర కేగుచు నందీశ్వరుని గూర్చి తపమొనర్చి యతని యనుగ్రహమును బొందెను. వినాయకుని కోరిక ప్రకారమీనంది "వి నా య క న ం ది" యను పేర ఖ్యాతి వహించునట్లు పరమేశ్వరుడనుగ్రహించెను.

ప్రస్తుత మీనంది యందలి స్వామివారికి (వినాయక నందీశ్వరునకు) నిత్యాభిషేక పూజాదులు జరుగుచున్నవి. దేవాలయమున ప్రస్తుతము ప్రశాంతి నిలయమై యొప్పుచున్నది.

4

## గరుడనంది

**ఇది మహానందికి పడమటి భాగమున నున్నది.**

ఇచట పూర్వము మాతృదాస్య విముక్తినిగోరి గరుత్మండమృత కలశమును దెచ్చుటకై బయలుదేఱుచువిజయమును జేకూర్చుటకు పరమేశ్వరునిగూర్చి తపమొనర్చి యతనియనుగ్రహమును బొందెను. నాటి నుండియు నీ ప్రదేశము గరుడనంది యను పేర ప్రసిద్ధి జెందియున్నది.

దేవాలయమున కీమధ్య కటాంజనము వేయించి యున్నారు. నిత్య పూజలు జరుగుచున్నవి. దేవాలయమునకు ముందు భాగమున నీడ నొసగు చెట్టు గలదు. కూర్చొనుట కరుగులు గలవు.

సమీపమున నాంజనేయస్వామి వేంచేసి యున్నారు. భక్తాదులు ప్రదక్షిణలు చేయుటకు తగినంత స్థలము గలదు.

5

## శివనంది లేక రుద్రనంది

ఇది మహానందికి ఉత్తర భాగమున 6 మైళ్ళ దూరములో "కడమలకాల్వ" యను గ్రామముననున్నది. (కడమలకాల్వకు తూర్పున 2 మైళ్ళ దూరమునందు గల "ఓంకార" మనెడి క్షేత్రమే శివనందియని కొందఱి మతము.



౬

# మహానంది

మహానంది యునికియు,

చరిత్రయును పాఠకులకు విదితమైనది.





(ముఖమంటపము)

7

# సూర్యనంది

మహానందికి పడమర 5 మైళ్ళ దూరమున "తమ్మడపల్లె"యను గ్రామము గలదు. ఆ గ్రామమునకు దక్షిణ భాగమున అరమైలు దూరములో నీ క్షేత్రము గలదు. సూర్యుడుదయించునపు డిచటి లింగముపై యరుణకిరణములు సోకును. అందుచే నీ నందికి "సూర్య నంది"యని పేరుగలదు. దీనిని సూర్యుఁడీశ్వరునిగూర్చి తపమొనర్చిన ప్రదేశమనియు నందురు.

సూర్యనంది చుట్టును పన్నెండామడల పట్టణమగుననియు వీర భోగవసంతరాయలు జన్మించినపుడచ్చటచ్చట తిరిగి నేరుగా సూర్య నందికి వచ్చి కొలది దినములుండుననియు, నటనుండి మహానందికి బోవుననియు కాలజ్ఞానము వలన దెలియుచున్నది.

ఈ క్షేత్రమునందు శ్రీశింగరి శేషన్నగారును, మద్దెల వెంకట స్వామిగారును, భక్తాదుల సహాయముతో నభివృద్ధికి వలయు నన్ని విధముల కృషిచేసిరి. పార్వతీ దేవాలయమును గట్టించి పార్వతీదేవిని ప్రతిష్ఠింపజేసిరి. ధ్వజ ప్రతిష్ట నవగ్రహ ప్రతిష్ఠ జేసిరి. దేవాలయ పునర్నిర్మాణ మొనర్చిరి. వైశ్యులకు అన్నసత్రం నేర్పాటు జేసిరి. కళ్యాణ మంటపమును గట్టించి చుట్టును ప్రాకారములు యాత్రికులకు వలయు వసతి గృహములు గట్టించిరి. వస్తువులను నిలువయుంచుట కొక గదిని నిర్మించిరి. నందిపల్లె గ్రామస్థులు పాత్ర సామాగ్రుల నిచ్చిరి. నంద్యాల పట్టణ వాసులగు శ్రీ పసపుల కొత్తూరయ్య

శ్రేష్ఠిగారు ఉత్సవ విగ్రహములు, వాహనములు తయారుచేయించిరి శ్రీచిత్తులూరు పెద్దన్నగారు బావిని బాగుచేయించి, కప్పి మొదలగు నేర్పాట్లు చేసిరి. ఈ క్షేత్రమునందు 4,5 ఎకరముల మామిడితోట కొంత భూమియుగలదు. ఈ క్షేత్రమునకు తూర్పుభాగములో కొంత దూరమున మఱియుక శివలింగము గనబడినది. ఆ లింగముండిన ప్రదేశము "ఇటుకనంది" యందురు. ఆ నందిని తరువాతి వారెవరో నిర్మించియుండవచ్చును. ఈ శివలింగమిప్పటి శివాలయ ముఖద్వారమున నుంచబడినది. శివరాత్రినాడు మహానందిలో వలనే గొప్ప యుత్సవములు జరుగును.





8

## విష్ణునంది (లేక) కృష్ణనంది

ఇది మహానంది కుత్తరభాగమునకు గొలదిగా నెడమ వైపున 2½ మైళ్ళ దూరమున "కడమకాల్వ" గ్రామమునకు ఆగ్నేయ భాగమున గలదు. విష్ణు వొకప్పుడీప్రదేశమున నందీశ్వరుని గూర్చి తపమాచరించి యతని యనుగ్రహమును బొందెనందురు. అందువలన నీ ప్రదేశమునకు "విష్ణునంది"యని పేరు వచ్చింది. ఇచట పేము కఱ్ఱ యెక్కువగా నుండును. సుద్దగనులుగూడ గలవు. ఇందలి నీటిచే కొన్ని వందల యెకరముల భూమి సాగగుచున్నది. ఈ క్షేత్రమునకు బయ్యపుకోడూరు గ్రామనివాసులగు శ్రీ చిట్టిబొట్లఈశ్వరశర్మగారు ధర్మకర్తగా నుండి భక్తుల ప్రోత్సాహముచే చాల యభివృద్ధి జేసిరి. అనేక మంటపములు, పార్వతీయాలయము, వినాయకుని గుడి, ధ్వజ ప్రతిష్ట బసవప్రతిష్ట, నవగ్రహ ప్రతిష్ట మొదలగు వానిని జేయించిరి. గోసుపాడు గ్రామనివాసులగు శ్రీ ద్వారం నాగిరెడ్డిగారు తెల్లచలువ రాతితో బసవేశ్వరుని బ్రతిష్టింపజేసి మంటపమును నిర్మించిరి శివరాత్రినాడు మహానంది క్షేత్రమునందువలెనే రథోత్సవములు వైభవోపేతముగా జరుగును.

9

# సోమనంది

ఇది నంద్యాల పట్టణమునకు తూర్పు ద్వారమున నున్నది.

సోముడనగా చంద్రుడనియర్థము. పూర్వము సోముడు సోమశేఖరు (ఈశ్వరు)ని గూర్చి తపమొనర్చి ధన్యుడయ్యెను. సోముడు సోమశేఖరుని యనుగ్రహమునకు పాత్రుడైన నీ ప్రదేశము "సోమనంది"యని ప్రఖ్యాతి వహించినది.

ఈ క్షేత్రమునకు కావలసినంత భూమి గలదు. అనేక వసతి గృహములు, చప్పరములు చెట్లును గలవు. మంచినీటి బావి కలదు. ఇచ్చట నిత్యపూజాదులు జరుగుచుండును. మాసశివరాత్రి పూజలు జరుగును. శివరాత్రి ఉత్సవములు, వేడుకలు వైభవముగా జరుగును. నీటివసతి గృహవసతులుండుటచే వివాహ మహోత్సవములెక్కువగా జరుగుచుండును. నంద్యాల పట్టణమందే యుండుటచే యాత్రికులే గాక పురజనులుసైతమీ దేవుని దర్శించుచుందురు. ధర్మకర్తలు భక్తాదుల సహాయముచే ప్రజలను ప్రోత్సహించుచు దేవాలయాభివృద్ధికి కృషి సల్పుచున్నారు.

ఒకే దినమున భక్తితో నవనందుల తీరములందు స్నానమాచరించి, యచటి లింగముల దర్శించువారికి మిగుల పుణ్యము గలిగి యైహికాముష్మిక సుఖములు గలుగునని వక్కాణింతురు.

పిన్న పెద్దలు నందలు ప్రియము మీఱ
జాతి కులభేదముల మాట సరకుగొనక
నేగి సర్వేశు సేవింప నేర్పుతోడ
నిహపరంబుల సుఖ మీఱ డిచ్చుగాక.

# మహానంది పాటలు

## 1

("ప్రేమకోసమై వలలో బడనే" అను మాదిరి)

మమ్ముబ్రోవుమా మహానందీశా - మ ఱువక దలచెదమూ
ఈశా. మఱువక దలచెదమూ.

తమ్మిచూలినుత దర్శన మొసగియు దాపునజేరిచిదయగనుమా సెమ్మ
నముున నినునమ్మినవారిని-సమ్మదముగా బ్రోగరావా

॥మమ్ము॥

1) చిన్నిబాలునా మార్కండేయుని-జముని బారి బోవగలేదే సన్నుతించె
దము పన్నగభూషణ-సద్గతినొసగియు బ్రోవగదే

॥మమ్ము॥

2) శంబోశంకర మహదేవాయని సాంబశివా నినుదలచెదమూ కంబు
కంఠ కైలాసవాస శివ-కావగదే నెల్లెడలముమూ

॥మమ్ము॥

3) ఇంపుమీఱ నవనందులయందును సొంపుగ వెలసినసర్వేశా సంపద
సౌఖ్యము జ్ఞానము ముక్తియు-సమకూర్చగదే

లోకేశా ॥మమ్ము॥

4) ఇమ్మహితమ్మడపల్లెలోభూమా-రామాయాఖ్యనుత శ్రీకంఠావేమరు
నిను మదిచాల భజింతుము-పామరులము మము

బ్రోవగదే ॥మమ్ము॥

2

("అదిగో భద్రాద్రి గౌతమి ఇదిగో చూడండి"అనువాదిరి")

అదిగో మహానందీ గోపుర మిదిగో చూడండి ॥అదిగో॥

నంది మొదలుగా ప్రమథగణంబులు
ముదమున నాట్యంబాడుచుండు స్థల ॥దదిగో॥

1) కామేశ్వరి గంగాభవానియు
కంబుకంధరుని ఘనముగ గొలిచెడి ॥దదిగో॥

2) కదళీవనములు ఖర్జూరంబులు
బదరీతరువులు బాగున నుండెడి ॥దదిగో॥

3) నలమల కొండల దృశ్యంబులతో
నారికేళఫల భూజంబులతో ॥దదిగో॥

4) మారెడు పత్రియు మాచిపత్రియును
మంచి గంధపు మానునునుండెడి ॥దదిగో॥

5) లింగరూపుడై గంగాధరుడు భు
జంగభూషుడై చాలగనుండెడి ॥దదిగో॥

6) చుట్టు ప్రహరియు గోపురంబులు
నట్టనడుమ నందీశుడు వెలిచెడి ॥దదిగో॥

3

("చల్లనిరాజా ఓ చందమామ" అను మాదిరి)

నవనందీశా నన్నేలరావా
కరుణించి దరిజేర్చి కావంగరావా నన్నేలరావా ॥నవ॥

1) పాలచంద్రాధరా నిన్ను ప్రార్థింతురా
చాలా భక్తితో నిన్నే సేవింతురా
దివ్యగంగాధరా మేరు శైలాధరా
ఎల్లవేళల నిన్నే ధ్యానింతురా ॥నవ॥

2) త్రిపురాంతక త్ర్యంబక మృత్యుంజయా
ప్రమదాధిప భూతేశ పరమేశ్వరా
శర్వ సర్వేశ్వరా నిన్నె సేవింతురా
నన్ను దయజూచి నిరతంబు గాపాడరా ॥నవ॥

3) నవనందులయందును వెలసితివీ
నిన్ను సేవించు భక్తుల బ్రోచితివీ
నీదు కైంకర్య మెవ్వేళ గావించెదా
నాదు ప్రార్థన మన్నించి గాపాడవా ॥నవ॥

4) సుజనసేవిత మునినుత మహేశ్వరా
భవసంహార భవభీమ భూతేశ్వరా
నీలకంఠా నిన్నే ధ్యానింతురా
నన్ను గృపతోడ నిత్యంబు గాపాడరా ॥నవ॥

4

("కలవరమాయే మదిలో" అనుమాదిరి)

గిరిజాపతి మము బోవుమురా, మముబోవుమురా ||గిరిజా||
గౌరిమనోహర గంగాధర శివ-గిరిజాపతి మముబోవుమురా

1) ప్రథమనందిలో ప్రథమగణంబులు-భక్తిమీఱ సేవించగను ముద
మొందగ యట వెలయుచుండెడి-మునిజన సేవిత
మోక్షప్రదా ||గిరిజా||

2) నాగనందిశివ నాగభూషణా-నందివాహనా నజరాజా బాగుగా నీపద
పద్మంబులను-భక్తితోడ సేవించెదమూ ||గిరిజా||

3) వినాయకనందిలో వెలయుచునుండెడి వేదవేద్యసర్వేశశివా సోమ
శేఖరా సురమునివందిత-స్తుతి యొనర్చెదము
సాంబశివా ||గిరిజా||

4) గరుడనందిశివ మరువక దలతుము-గావుము శంకరసర్వేశా దురిత
దూరపున సంహార పశుపతి-నిర్మలము నిను
భజియింతుమురా ||గిరిజా||

5) శివనందీశ్వరా యీశాశంకర-శీఘ్రమె బ్రోవుము శ్రీకంఠా భవహర
వేగమె భవనముల బాపియు-భక్తినొసంగుము
పరమేశా ||గిరిజా||

6) ఆహరహము నిను గొల్చుచునుందుము-మహానందీశ్వరా
మఱువకనూ
ఇహపర సౌఖ్యములిచ్చి బ్రోవుమయ-యీశ మహేశ
సురేశ శివా ॥గిరిజా॥

7) సూర్యనందిశివ శుభకర- స్తుతియింతుము నిను సాంబశివా ధైర్య
ముతో నిను ధ్యానింతుము హర-దర్శన మొసగియు దయగనుమా
॥గిరిజా॥

8) విష్ణునందిశివ భజయింతుము నిను-విసులొగ్గివినరాదె శివా
విష్ణువాది సురవర్యసేవిత వినుతింతుము హర సాంబశివా
॥గిరిజా॥

9) సౌమనందిశివ గౌరీరమణా ప్రేమతో బ్రోవుము సదాశివా సోమశేఖరా
సురమునివందిత-స్తుతియొనర్చెదము సాంబశివా
॥గిరిజా॥

5

("నీవుండే దాకొండపై" అను మాదిరి)

మహానందీ తిరుణాలకు-పోవుదము-మనమందరమునుగూడియు
సహజానందము బొందుచు శంకరు-నహరహము సేవింతుము
॥మహానందీ॥

1) చుట్టు ప్రాకారంబుల-స్వామికి కట్టిన మంటపంబుల నట్టనడుమ
కోనేటిని మనమంత దిట్టముగా కనుగొందము ॥మహానందీ॥

2) శివరాత్రి జాగరణము-సల్పియు శివసన్నిధిని జేరియు,
భవ! మమ్ము బ్రోవుమంచు స్వామిని-పలుమార్లు బ్రార్థింతము
॥మహానందీ॥

3) లింగోద్భవకాలంబున-దేవుని గంగాభిషేకముతో మంగళహారతులతోడ సర్వేశు-మనమంత సేవింతము ॥మహానందీ॥

4) మఱునాడు నందివాహనుడై-శంకరుడు గిరిజా సమేతంబుగా
సురసంఘములు గొలువగా-నూరేగి-స్వస్థానమును జేరును
॥మహానందీ॥

వేలజనులు లాగుచుండగా-రథమెంతో వేగముగ నేగుచుండగా
అలసటజెందక మనమెల్ల తిరిగియు-సెలవుల కరుదెంతము
॥మహానందీ॥

6

("సర్వమంగళనామా" అనుమాదిరి)

గౌరీరమణా గంగాధరా నను-గాపుమయ్యా
నిరతము నిను వేడుచుండెదము-మరువకయ్యా ॥గౌరీ॥

1) బాలుడౌ నా మార్కండేయుడు-చాలా నిన్ను
జాలుబారిగావుమంచన గాచీ బ్రోవవా ॥గౌరీ॥

2) ఎన్ని జన్మంబులలో నిన్ను-వెన్నుచుండగా
పన్నుగ నరజన్మ నొసగిన పన్నగభూషా ॥గౌరీ॥

3) ఎద్దునెక్కిన పెద్దదొరవని-వేడుచుంటిని
గ్రద్దనెక్కినవాని సఖుడని-గావుమంటిని ॥గౌరి॥
రామ యాఖ్య నేలినట్టి-సామి నీవని
ప్రేమతో మహానందిశివాయని బిలుతు శంకరా ॥గౌరి॥

7

["ఏరువాకా సాగరో" అనుమాదిరి]

మహానందికి పోదమురో రన్నోచిన్నన్నా
మన పాపమంతా బోవునురో రన్నోచిన్నన్నా
ఓంకారమునకు యోజనంబట
గాజులపల్లెకు-యోజన సగమంట
కందనూలునకు-నైదు క్రోసులట
నంది యాలకును-పది మైళ్ళనట ॥మహా॥

1) కదళీఫలముల-కాంతిచెట్లతో
నారికేళముల-నృత్యంబులతో
పనసఫలంబుల-భూజంబులతో
జాజీతీవలతొ శోభించెడునట ॥మహా॥

2) చుట్టుగనుండెడి-మంటపములతో
ప్రక్కగనుండెడి-ప్రకృతిశోభతో
వింగనుండెడి-కాంతి తీగలతో
జక్కగ వెలిగెడి-క్షేత్రరాజమట ॥మహా॥

3) విస్మయ మొదవెడి_విగ్రహంబుల
జాడలు దెలియుని-నీటిరాకడల
కమ్మని జలముల_కాసారంబుల
నిశ్చలంబు నతి_నిర్మల స్థలమట ॥మహా॥

4) మాఘమాసమున-బహుళపక్షమున
చతుర్ధశియను_శుభతిథియందున
శివజాగరణము-జేయుచునుండిన
శివకృపబొందుట-సుకరంబగునట ॥మహా॥

5) ఆదినమందున_యాదిశివునకు
కామేశ్వరితో_కళాణంబట
సాదరమున మన_మందఱ మొకటై
సాంబశివాయని_సన్నుతి జేతము ॥మహా॥

8

("గరుడగమనరారా" అనుమాదిరి) తాళము-అది

మహానందీశ శివా శంకర మఱువక దలచెదరా! అహము నడంచియు
నాదరింతువని యహరహము నేగొలుచుచు నుండెద ॥మహా॥

1) దురితజాలములను ద్రుంచుము మఱిమఱి వేడెదను కరిచర్మాంబ
రధల హర పు హర సరగున బ్రోవుము సన్నుతించెదను
॥మహా॥

2) అష్టకష్టములనుబడినే నలసట నొందితిని
సృష్టిస్థితి లయకారణయనుచును స్పష్టముగా నిను
సన్నుతించెదను ॥ మహా ॥

3) రామయాఖ్యనేలా శంకర రయమున రావేలా
కామితదాయక కరుణాసింధూ యుమామహేశ్వర రమా॰
వినుత శివ ॥ మహా ॥



9

("రావోయి చందమామా" అను మాదిరి)

మహానంది శంభులింగా
మము బ్రోవరా శులింగా ॥మహ॥

1) అహరహమును నిను మరువకునూ
అతి దీనుడనై వేడెదనూ
గతిజూపు దేవదేవా
కరుణించి సుప్రభావా ॥మహ॥

2) కైలాసవాస యీశా
కమనీయ నాగభూషా
కరుణించు మందహాసా
కైవల్యపుర నివాసా ॥మహ॥

3) బి రామయాఖ్యనేలా
బిలిచినను రావదేలా
కలనైన మరువజాలా
కరుణించు లోకపాలా ॥మహ॥

# మంగళాచరణము

1) మంగళ ముమామహేశ్వర!
మంగళమో నాగభూష! మహనీయగుణా!
మంగళమో గంగాధర!
మంగళ మోంకారరూప మహనందీశా!

2) మంగళము మేనకాత్మజ!
మంగళమో మహిషదైత్య మర్దని!మాతా!
మంగళము కామరూపిణి!
మంగళమిదె నీకు సర్వమంగళ గౌరీ!

3) మంగళమో దశరథాత్మజ!
మంగళమో మౌనిసుత! మహిశాధీశా!
మంగళము రాక్షసాంతక!
మంగళ మొసగెదను సర్వమంగళనామా!

4) మంగళము లక్ష్మణాఖ్యా!
మంగళమో నిష్కళంక మానస!ధీరా!
మంగళమో రామానుజ!
మంగళమో మేఘనాథ మర్దితశూరా!

5) మంగళము బ్రహ్మచారీ!
మంగళమో రామభక్త! మాన్యతచరితా?
మంగళ మంజని తనయా!
మంగళమో కార్యశూర! మారుత! హనుమా!

— ० —

